


# మహాత్మాగాంధీ : ముస్లిం సహచరులు–అనుచరులు

(MAHATHMA GANDHI : MUSLIM COLLEGUES - FOLLOWERS)

**సయ్యద్ నశీర్ అహమ్మద్**

Syed Naseer Ahamed



ప్రచురణ సంఖ్య : 17

ప్రథమ ముద్రణ : డిసెంబర్ 2019

ద్వితీయ ముద్రణ : ఫిబ్రవరి 2020

ముఖపత్రాలంకరణ : అబ్దుల్లా, విజయవాడ.

టైపు సెట్టింగ్ : **జయదీప్తి గ్రాఫిక్స్, వినుకొండ**

ముద్రణ : **జయదీప్తి గ్రాఫిక్స్, వినుకొండ**

**ప్రతులకు :**

**ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్**

ఫ్లాట్ నం. సి–2, శ్రీరామ్స్ ఆర్కేడ్, అమరావతి రోడ్,

**ఉండవల్లి – 522 501,**

తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్

దూరవాణి: + 91 9440241727

Mail:

naseerahamedsyed@gmail.com,

**వెల : 25–00**

**భా**రత స్వాతంత్ర్యసంగ్రామం చివరి అధ్యాయమైన జాతీయోద్యమం దశ-దిశను శాసించి మహాత్మాగాంధీగా విఖ్యాతుడైన మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ ప్రజోద్యమాల దిశగా తొలి అడుగు వేసినప్పటి నుండి భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించేంత వరకు పలువురు ముస్లిం యోధులు ఆయనకు సహచరులుగా, అనుచరులుగా అసామాన్యమైన అండదండలు అందించారు, ఆయన బాటను త్రికరణశుద్ధితో అనుసరించారు. 1891లో మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ లండన్‌లో న్యాయశాస్త్రం చదివి బారిస్టర్‌గా భారతదేశం తిరిగి వచ్చి న్యాయవాదిగా నిలదొక్కుకుంటున్న సమయంలో ఓ మంచి అవకాశం ఆయనకు దక్కింది. ఆ అవకాశం 'బారిష్టర్ యం.కె గాంధీ' నుండి 'జాతిపిత మహాత్మాగాంధీ'గా మార్పు చెందిన ఆయన చారిత్రక క్రమానికి పునాదులను నిర్మించింది.

## మార్గదర్శిగా దాదా అబ్దుల్లా

బారిస్టర్ గాంధీని ప్రజాసేవా దిశగా మళ్ళించడంలో దక్షిణాఫ్రికాలో వ్యాపారం నిర్వహిస్తున్న భారతీయ సంపన్న వ్యాపారి దాదా అబ్దుల్లా సహచర్యం, దక్షిణాఫ్రికాలో ఎదురైన సంఘటనలు ప్రధాన పాత్ర నిర్వహించాయి. అబ్దుల్లా దక్షణాఫ్రికాలో MESSRS DADA ABDULLA & COMPANY నిర్వహిస్తున్నారు. ఆయన పూర్తిపేరు ABDOOLA HAJEE ADAM JHAVERI. ఆయన గాంధీజీ స్వగ్రామమైన గుజరాత్ రాష్ట్రం పోర్‌బందర్ నివాసి. ఆయన వ్యాపార సంస్థలకు సంబంధించిన పలు వాజ్యాలు దక్షిణాఫ్రికా న్యాయస్థానాలలో నడుస్తున్నాయి. ఆ వాజ్యాలలో దక్షిణాఫ్రికా న్యాయవాదులకు సహకరించేందుకు దాదా అబ్దుల్లా అండ్ కో భాగస్వామి షేక్ అబ్దుల్ కరీం జావేరి గాంధీజీని దక్షిణాఫ్రికాకు రావాలంటూ ఆహ్వానించారు. ఆ ఆహ్వానం మేరకు 1892లో బారిష్టర్ గాంధీ దక్షిణాఫ్రికా చేరుకోగా అబ్దుల్లా అండ్ కో ప్రధాన భాగస్వామి దాదా అబ్దుల్లా స్వయంగా స్వాగతించి, తన ఇంటికి తీసుకెళ్ళారు. అప్పటి నుండి అన్ని విషయాలలో మోహన్‌దాస్ కరంచంద్ గాంధీకి ఆయన మార్గదర్శిగా నిలిచారు.

దక్షిణాఫ్రికాలో భారతీయులు ఎదుర్కొంటున్న వివక్షతను గాంధీ చూసారు, స్వయంగా అనుభవించారు. భారతీయుల నిస్సహాయ స్థితిగతులను గమనించారు. దాదా అబ్దుల్లా ఆయన సహచరుల ద్వారా మరిన్ని వివరాలను తెలుసుకున్నారు. ఈ సందర్భంగా ఎదురైన పలు సంఘటనలలో దాదా అబ్దుల్లా స్వయంగా గాంధీజీకి మార్గదర్శకులు అయ్యారు. దక్షిణాఫ్రికాలో కొన్ని సందర్భాలలో స్థానిక పద్ధతులను గాంధీజీ అనుసరించడానికి సిద్ధపడినా,


DADA ABDULLAH (-1912)

ఆ చర్యలు అక్కడి భారతీయుల ఆత్మగౌరవానికి భంగకరం కాగలవని దాదా అబ్దుల్లా ఆయనను వారించిన సందర్భాలూ ఉన్నాయి. ఈ విషయాన్ని గాంధీజీ తన THE STORY OF MY EXPERIMENTS WITH TRUTH లో కూడా ప్రస్తావించారు.

1894లో బారిష్టర్ గాంధీ స్వదేశానికి వెళ్ళ దలిచారు. ఆ సందర్భంగా దాదా అబ్దుల్లా కార్యాలయంలో ఆయనకు వీడ్కోలు సమావేశం జరిగింది. ఆ సమయాన స్థానిక వార్తాపత్రిక ద్వారా దక్షిణ ఆఫ్రికాలో ఎన్నో ఏళ్ళుగా నివాసం ఉంటున్న భారతీయులకు రానున్న ఎన్నికలలో ఓటు హక్కును హరించ గల చట్టాన్ని దక్షిణాఫ్రికా ప్రభుత్వం త్వరలో తీసుక రానున్న విషయం గాంధీజీ, ఇతర మిత్రుల మధ్యన చర్చకు వచ్చింది.

## అబ్దుల్లా అధ్యక్షులు-గాంధీజీ కార్యదర్శిగా NIC

ఈ వివక్షత మీద పోరాటం చేయాలని తీసుకున్న నిర్ణయం మేరకు గాంధీజీ మార్గదర్శకంలో 'నాటల్ ఇండియన్ కాంగ్రెస్' NATAL INDIAN CONGRESS (NIC) 1894లో ఏర్పాటయ్యింది. ఈ NIC సంస్థ అధ్యక్షులుగా దాదా అబ్దుల్లా, కార్యదర్శిగా యం.కె.గాంధీ వ్యవహరించగా, Hajee Mahomed Hajee Dada, Abdool Kadir, Hajee Dada Hajee Habib, Moosa Hajee Adam, P. Dawjee Mahomed, Peeran Mahomed, Hoosen Miran, Adamjee Miankhan, Moosa Hajee Cassim, Mahomed Cassim Jeeva, Dawad Mahomed, Hoosen Cassim Amod Tili, Omar Hajee Aba, Hajee Mahomed (P. M. Burg), Camroodeen (P. M. Burg) ఉపాధ్యక్షులుగా బాధ్యతలు చేపట్టారు. Goolam Hoosen Randeri, Shamshoodeen, G. A. Bassa, Ibrahim M. Khatri, Shaik Farid, Varind Ismail, Joosub Abdool Carim, Ismail Kadir, Easop Kadua, Mahomed Esak, Mahomed Hafejee,Osman Ahmed & Mahomed Tayub లాంటి ప్రముఖులు, ఇతరులు కార్యనిర్వాహక వర్గంగా NIC కార్యక్రమాల నిర్వహణకు పూనుకున్నారు.



MAHATHMA GANDHI
WITH LEADERS OF THE NATAL INDIAN CONGRESS, 1894

## ప్రజా సేవ చేయాలన్న తలంపు

ఈ సందర్భంగా 'ప్రజా సేవ చేయాలన్న తలంపు నాకు అక్కడే కలిగింది. అందుకు అక్కడే శక్తి చేకూరింది' అని గాంధీజీ తన ఆత్మకథలో రాసుకున్నారు. ఆయన 21 ఏండ్లపాటు దక్షిణాఫ్రికాలో ఉన్న సమయంలో సాగించిన పోరాటానికి ప్రధానంగా హాజీ ఈసా సమద్, అబ్దుల్ గని, మహ్మద్ ఖాసిం, కమరుద్దీన్, ఆదంజీ మియా ఖాన్, దావూద్ సేత్ లాంటి వ్యక్తుల సంపూర్ణ సహకారం లభించింది. MESSRS DADA ABDULLA & COMPANY అధినేత, దాదా అబ్దుల్లా గా విఖ్యాతుడైన ABDOOLA HAJEE ADAM JHAVERI. బ్రతికి ఉన్నంత కాలం గాంధిజీ పలు విషయాలలో మార్గదర్శకం వహిస్తూ, గాంధీజీ చేపట్టిన సత్యాగ్రహ ఉద్యమాలు, ఫీనిక్స్ ఆశ్రమం నిర్వహణకు ఆర్థికంగా-హార్థికంగా చేయూత ఇవ్వడం మాత్రమే కాకుండా తన సహచరుల సహకారం కూడా లభించేలా విజయవంతంగా కృషిచేశారు. ఆ కారణంగా దాదా అబ్దుల్లా గాంధీజీకి అందించిన సహాయాన్ని, సహకారాన్ని ప్రస్తావిస్తూ 'So we can say that Dada Abdulla was first supporter of Mahatma Gandhi in South Africa Satyagraha movement. He taught and supported him like his father.' అని Dada Abdulla and Mahatma Gandhi అను తన వ్యాసంలో Prof. Yogendra Yadav వ్యాఖ్యానించారు.

## గాంధీజీ వెంట ఇండియాకు ఇమాం సాహెబ్

1892లో దక్షిణాఫ్రికా ప్రవేశించి సత్యాగ్రహ ఉద్యమాలతో భారతీయులకు సానుకూలంగా కొన్ని సత్ఫలితాలను సాధించిన బారిష్టర్ గాంధీ సత్యాగ్రహోద్యమ నేతగా మారిన తరువాత 1914లో దక్షిణాఫ్రికా లోని ఆశ్రమాన్ని, ఇతర కార్యకలాపాలను తన సహచరులకు వదలి 1915లో భారతదేశం వచ్చారు. మహాత్మాగాంధీ తిరిగి భారతదేశం వస్తున్న సందర్భంగా ఆయన వెంట ఆయన ఫీనిక్స్ ఆశ్రమ సహచరుడు ఇమాం అబ్దుల్ ఖాదిర్ బవాజిర్ (–1931) కూడా ఇండియా వచ్చారు. ఆయన గాంధీజీ ఏర్పాటు చేసిన సబర్మతీ ఆశ్రమంలో అతి సామాన్య వ్యక్తిగా ఆశ్రమ ముద్రణాలయం బాధ్యతలను చేపట్టారు. ఈ ముద్రణాలయంలో, గాంధీజీచే 'ఇమాం సాబ్'గా పిలువబడుతున్న అబ్దుల్ ఖాదిర్, ఆయన సతీమణి ఇమాం సాహెబా, కుమార్తెలు ఫాతిమా బేగం, ఆమనా ఖురేషి (1905–1967) పనిచేసేవారు. ఇమాం అబ్దుల్ ఖాదిర్ కుంటుంబం సబర్మతీ ఆశ్రమంలో గడిపింది. గాంధీజీ అబ్దుల్ ఖాదిర్‌ను తన సోదరునిగా పరిగణిస్తూ గౌరవించారు.

## ఫాతిమా వివాహానికి గాంధీజీ పెళ్ళిపెద్ద

ఆ అనుబంధం వలన 20 సంవత్సరాల బేగం ఫాతిమా వివాహం విషయంలో గాంధీజీ ప్రత్యేక శ్రద్ధ చూపారు. ఆమె వివాహ ఆహ్వానపత్రాన్ని ఆయన స్వయంగా రూపొందించారు. ప్రముఖులను, ప్రజలను వివాహానికి ఆహ్వానిస్తూ 1920 ఏప్రిల్ 2న వెలువడిన ఆహ్వాన పత్రిక గాంధీజీ పేరిట ప్రచురితమై జాతీయోద్యమ సాహిత్య చరిత్రలో ప్రత్యేక స్థానం పొందింది. ఆ ఆహ్వాన పత్రిక ఇలా సాగింది.

'ప్రియమైన మిత్రమా ! ఫాతిమా బేగం నా మిత్రులు మరియు నా సోదరులు ఇమాం అబ్దుల్ ఖాదిర్ సాహెబ్ గారి జ్యేష్ట పుత్రిక. ఇమాం సాహెబ్ దక్షిణాఫ్రికాలో, భారత దేశంలోని ఆశ్రమ, జైలు జీవితంలో నా సహచరులు. సయ్యద్ హుస్సేన్ మియాతో ఫాతిమా బీబీ వివాహం 1920 ఏప్రిల్ 26 తేది శనివారం సాయంత్రం ఏడు గంటలకు జరపాలని నిశ్చయమైంది. ఆరున్నరకు మిలాద్ షరీఫ్ ఆరంభమౌతుంది. ఈ సంతోషకర సమయంలో మీరు కూడా కార్యక్రమంలో పాల్గొని వధూవరులను తమ శుభాకాంక్షలతో అలంకృతులను చేయగలరు. ఇట్లు, మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ.' అంటూ ఆహ్వాన పత్రాలను వేయించి ప్రముఖులను వివాహానికి ఆహ్వానించారు. గాంధీజీ స్వయంగా దగ్గరుండి సబర్మతీ ఆశ్రమంలో ఫాతిమా పెండ్లి జరిపించారు. ఈ వివాహం గురించిన తన 'నవజీవన్' పత్రికలో మహాత్మాగాంధీ విశేషంగా ప్రస్తావించారు.

ఇమాం అబ్దుల్ ఖాదిర్ గురించి, ఆయన కుటుంబం గురించి గాంధీజీ చాలా విస్తారంగా రాశారు. ఈ విషయాలన్నీ Collected works of Mahathma Gandhi,

Govt. of India Publications లో మనకు లభిస్తాయి. మహాత్ముడు స్వయంగా ఇమాం సాహెబ్ దక్షిణాఫ్రికా జీవితం, భారత దేశం లోని సబర్మతి ఆశ్రమ జీవితం గురించి ఈ విధంగా ప్రస్తావించారు.

'దక్షిణాఫ్రికాలో 'ఇమాం గారిల్లు ఆంగ్లేయుల పద్ధతిలో నిర్మాణమైంది. ఇమాం గారి భార్య చిన్నప్పటి నుండి ఆంగ్లేయ రీతి రివాజులతో కూడిన జీవితాన్ని అనుసరిస్తున్న వ్యక్తి. ఫాతిమా, ఆమనా వారి కుమార్తెలు. ఆంగ్లేయ పిల్లల పద్ధతులలో వారిరువురి పెంపకం సాగింది. ఐశ్వర్యవంతమైన సర్వ సుఖభోగాల జీవితాన్ని త్యజించి కుటుంబం యావత్తు ఫకీరు జీవితాన్ని అవలంభించటం అంత సులభమైన పని కాదు. ఒక్కసారి దృఢ సంకల్పం చేసుకున్నాక ఇమాం గారికి అది ఏమాత్రం పెద్దపని కాదు. నేను జోహన్స్‌బర్గ్ వదలి ఫీనిక్స్‌కు నివాసం మార్చగానే ఇమాం సాహెబ్ కూడా నా తోపాటుగా ఉండేందుకు నిర్ణయం తీసుకున్నారు. ఆయన దృఢనిశ్చయం గురించి తెలిసి ఉండి కూడా ఆయనకు ఏవిధంగా జవాబివ్వాలన్న ఆందోళన నాలో ఉండేది. జీవితంలో ఎటువంటి కష్టం నష్టం ఎరుగని వ్యక్తి అంతటి ఐశ్వర్యాన్ని వదలి ఫోనిక్స్‌లో ఒక మజ్దూర్‌గా జీవితం ఎలా గడపగలరు! ఆయనకు ఫోనిక్స్ కఠోర జీవితం గురించి తెలిపాను. ఫోనిక్స్ రావడానికి మీరు స్వయంగా నిర్ణయించుకున్నట్టయితే హాజీ సాహెబా (ఇమాం గారి భార్య), కుమార్తెలు ఫాతిమా, ఆమనా సంగతేంటని ప్రశ్నించాను. నా ప్రశ్నకు సమాధానంగా 'నాకు భగవంతుని మీద పూర్తి విశ్వాసముంది. మీరు హాజీ సాహెబాను పూర్తిగా ఎరుగరు. నేను ఎక్కడ ఉన్నా, ఏ స్థితిలో ఉన్నా అక్కడ ఉండేందుకు ఆమె సదా తయారుగా ఉంటారు. మన సంఘర్షణ అంతం ఎప్పుడో మనకెవరికీ తెలియదు...ఒక సత్యాగ్రహి అన్ని రకాల సౌలభ్యాలు, ఐశ్వర్యం, ధనసంపదల మీద కోరికలను త్యాగం చేయాలి.' అని ఇమాం సాహెబ్ అన్నారు. ఈ సమాధానంతో నాకెంతో సంతోషం కలిగింది. నా ఫీనిక్స్ సహచరులకు కూడా ఈ విషయం గురించి రాశా. మా ప్రయోగాన్ని, మా నిశ్చయాన్ని వాళ్ళంతా స్వాగతించారు. ఈ విధంగా ఇమాం సాహెబ్ ఆయన పరివారం



IMAM SAHEB ABUDL QADIR BAWAZIR (-1931)

మా వెంట వచ్చేశారు. ఫీనిక్స్‌లో ఇమాం సాహెబ్ మిగతా సహచరులతో సమానంగా భాగస్వామ్యం వహించారు. ఫోనిక్స్ ఆశ్రమంలో మా గృహాలు కొండ మీద ఉండేవి. ప్రతి వ్యక్తి తన వాడకం కోసం నీళ్ళను స్వయంగా కొండ దిగి వెళ్ళి కింద నుండి పైకి తెచ్చుకోవాలి. ఆ సమయంలో ఇమాం సాహెబ్ ఆరోగ్యం బాగా లేకున్నా ప్రతిరోజు ఉదయం పూట బక్కెట్లలో నీళ్ళుపట్టి 50 అడుగుల ఎత్తుకు మోసుకొచ్చేవారు.

భారతదేశం వచ్చాక, 'ఇమాం సాహెబ్, హాజీ సాహెబా, ఫాతిమా, ఆమనా ముద్రణాలయంలో పని చేసేవారు. ఇమాం సాహెబ్ కంపోజింగ్ పని నేర్చుకున్నారు. ఆయన లాంటి స్వభావంగల వృద్ధులు కంపోజింగ్ నేర్చుకోవడం ఆశ్చర్యకరం. ఆయన కుటుంబం మాంసాహారి. అయితే ఫీనిక్స్‌లో వారు మాంసాన్ని వండినట్టు నాకు గుర్తులేదు. అంతమాత్రాన ధార్మిక విషయాలలో ఆయనకు పట్టింపు లేదని కాదు. ఆయన నమాజ్ చేయకుండా ఎప్పుడూ ఉండలేదు. ఆయన పరివారం కూడా ఉపవాసం పాటించకుండా ఎప్పుడూ ఉండలేదు. ఆశ్రమవాసుల జీవనశైలిని పాటిస్తూ కూడా, ఇస్లాం ధార్మిక ఆలోచనల లోని విశాలత్వాన్ని వారు దర్శనీయం గావించారు. ఇమాం సాహెబ్ వ్యక్తిత్వం, బలిదానం మరికొన్ని పరీక్షలకు గురికావాల్సి ఉండింది'.

'1914లో అసలు పరీక్ష వారి ఎదుట నిలిచింది. దక్షిణాఫ్రికాలోని ఆశ్రమవాసులలో అత్యధికులు ఆశ్రమం వదలి భారతదేశానికి తిరిగి వెళ్ళడానికి నిర్ణయించారు. ఇమాం సాహెబాకు దక్షణాఫ్రికా స్వంత దేశమైపోయింది. హాజీ సాహెబా, ఫాతిమా, ఆమనాలకు భారతదేశం ఏమీ తెలియని అపరిచిత దేశం. వారికి ఏ భారతీయ భాషలో కూడా ప్రవేశం లేదు. ఆంగ్లం, డచ్ భాషలు తప్ప మరొక భాష వారికి తెలియని పరిస్థితి. అయినా కుటుంబ సమేతంగా భారతదేశం వెళ్ళాలన్న నిర్ణయం తీసుకోడానికి ఇమాం సాహెబ్‌కు క్షణం పట్టలేదు. సత్యాగ్రహం, హిందూ-ముస్లింల ఐక్యతల కోసం ఆయన చేసిన మహాత్యాగం ఇది. సబర్మతీ ఆశ్రమంలోని ప్రతి ఒక్కరికీ ఆయన దినచర్య గురించి తెలుసు...అల్లా పట్ల అధిక శ్రద్ధాళువైన ఆయన హృదయం స్వచ్ఛమైనది. ఆశ్రమ నియమ నిబంధనల పట్ల ఆయన విశ్వాసం మరింత దృఢం కాసాగింది',

ఈవిధంగా ఇమాం అబ్దుల్ ఖాదిర్ బవాజిర్ కుటుంబం గురించి ప్రస్తావించిన గాంధీజీ ఆయన కుమార్తెలు ఆమనా, ఫాతిమాల కార్యదక్షత, ధైర్యసాహసాలను కూడా విశేషంగా ప్రశంసించారు. భారత జాతీయోద్యమంలో చురుగ్గా పాల్గొన్న ఆమనా ఖురేషి, ఫాతిమా బేగంల ధైర్య సాహసాలను కొనియాడుతూ, 'ఫీనిక్స్, సబర్మతీ ఆశ్రమంలో పెంపకం, శిక్షణ పొందిన ఇమాం సాహెబ్ గారి అమ్మాయిలు అలా కాకుండా మరెలా ప్రవర్తిస్తారు' అని గాంధీజీ ప్రత్యేకంగా వ్యాఖ్యానించారు.


MOULANA MAZHARUL HAQ
(1866-1930)

దక్షిణాఫ్రికాలో తన సత్యాగ్రహ ఆయుధంతో వివక్షత మీద పోరాడి విజయం సాధించిన గాంధీజీ భారతదేశం 1915లో రాగానే ఆంగ్లేయుల మీద ఆయన ప్రయోగించిన తొలి అస్త్రం సత్యాగ్రహాస్త్రం. భారతదేశం చేరుకోగానే ఆయన సాగించిన తొలి పోరాటం 1917 నాటి సుప్రసిద్ధ 'చంపారన్ రైతాంగ పోరాటం'. బీహార్ రాష్ట్రం చంపారన్ ప్రాంతానికి రాకముందే నీలి మందు కర్మాగారాల యజమానులైన ఆంగ్లేయులు, ఆ ఆంగ్లేయులకు వత్తాసుగా నిలుస్తున్న ఆంగ్లేయ ఆధికారుల మీద దశాబ్ద కాలంగా సాగిన చంపారన్ రైతాంగ పోరాటానికి రైతు నాయకులు షేక్ గులాబ్ (1857-1920), పాత్రికేయుడు పీర్ ముహమ్మద్ అన్సారి మూనీస్ (1882-1949) తదితరులు పటిష్టమైన పునాదులను నిర్మించారు.

## తొలి ఉద్యమ స్థలి చంపారన్‌కు ఆహ్వానం

మహాత్మాగాంధీని బీహార్ రాష్ట్రం చంపారన్‌కు ఆహ్వానిస్తూ రాజకుమార్ శుక్లా (1875-1929), అందజేసిన వినతిపత్రాన్ని పీర్ మూనీస్ తయారు చేయడం మాత్రమే కాకుండా శుక్లాతో కలసి ఆయన లక్నో వెళ్ళి లక్నోలో జరుగుతున్న ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ సమావేశాల సందర్భంగా స్వయంగా గాంధీజీకి వినతిపత్రం అందించి, చంపారన్ రైతాంగం ఎదుర్కొంటున్న దుర్భర పరిస్థితులను వివరించారు. పీర్ మునీస్ తయారుచేసిన వినతిపత్రం మహాత్ముని మనస్సును కదిలించి చంపారన్ దిశగా అడుగులు వేయించింది.

భారతదేశం వచ్చాక చంపారన్‌లో తొలి సత్యాగ్రహ ఉద్యమానికి శ్రీకారం చుట్టనున్న సందర్భంగా భారతదేశంలోని కుల వివక్షత తీవ్రతను గాంధీజీ రుచి చూడాల్సి వచ్చింది. చంపారన్ రైతాంగ సమస్యను పరిష్కారం లక్ష్యంగా బయలుదేరిన ఆయన తొలుత పాట్నా చేరుకున్నారు. అక్కడ రాజ్‌కుమార్ శుక్లా ఆయనను పాట్నాలోని న్యాయవాది బాబూ రాజేంద్ర ప్రసాద్ ఇంటికి తీసుకెళ్ళారు. ఆ సమయంలో రాజేంద్ర ప్రసాద్ పాట్నాలో లేరు. ఆయన ఇంటి పనివాళ్ళు కులపరమైన ఆంక్షల వలన గాంధీజీని ఆ ఇంటి వరండాలోకి తప్ప



SHAIK GULAB SAHEB (1857-1920)

PEER MUHAMMAD ANSARI MUNIS (1882-1949)

లోనికి రానివ్వలేదు. ఆ గృహంలోని మరుగు దొడ్డిని ఉపయోగించడానికి కూడా అనుమతించ లేదు. బయట ఉన్న బావిలో నీరు తోడుతున్నా పనివాళ్ళు అభ్యంతరం చెప్పారు. ఈ విషయాలను మహాత్ముడు 'ఆత్మకథ'లో ప్రస్తావించడం కాకుండా తన కుమారుడు మగన్‌లాల్ గాంధీకి రాసిన లేఖలో రాజేంద్రప్రసాద్ ఇంటి పనివాళ్ళు 'మమ్మల్ని బిక్షగాళ్ళుగా పరిగణించారు' అని పేర్కొన్నారు.

ఆ సమయంలో ఆయన లండన్ సహాధ్యాయి, పాట్నావాసి అయినటువంటి బారిస్టర్ మౌలానా మజ్‌హరుల్ హఖ్ (1866-1930) గుర్తుకు వచ్చారు. తమ పరిస్థితి, ఎదురైన ఇక్కట్లను వివరిస్తూ ఆయనకు కబురు పంపారు. మౌలానా హఖ్ ఆఘమేఘాల మీద మహాత్ముడి వద్దకు వచ్చి వాలారు. పరిస్థితులను అర్థం చేసుకున్న ఆయన గాంధీజీ ముజఫర్‌పూర్ వెళ్ళడానికి స్వయంగా తగిన ఏర్పాట్లు చేసారు. ఆ తరువాత మౌలానా మజ్‌హరుల్ హఖ్ చంపారన్ సత్యాగ్రహ ఉద్యమంలో చురుగ్గా పాల్గొనడం మాత్రమే కాకుండా తన అత్యంత విలాసవంతమైన జీవితానికి స్వస్తి పలికి ఆశ్రమ జీవితం గడుపుతూ గాంధేయ మార్గంలో భారత స్వాతంత్ర్యోద్యమానికి అంకితమయ్యారు.

మహాత్మాగాంధీ పాట్నా నుండి రాజ్‌కుమార్ శుక్లాతో కలసి ముజఫర్‌పూర్ వెళ్ళి అటునుండి చంపారన్ చేరుకున్నారు.'ఆత్మకథ'లో గాంధీజీ 'చంపారన్ మచ్చ' (The Stain


BATHAQ MIYA ANSARI
(1869-1957)

of Indigo) అను శీర్షికతోపాటు వివిధ శీర్షికల క్రింద చంపారన్ సత్యాగ్రహ ఉద్యమానికి సంబంధించిన వివరాలను గాంధీజీ పేర్కొన్నారు. చంపారన్ ప్రాంతానికి చేరుకున్న మహాత్మాగాంధీ మరుసటి రోజు నుండే కార్యాచరణకు దిగడంతో పెద్ద సంఖ్యలో చంపారన్ రైతులు ఆయన వద్దకు విచ్చేసి నీలిమందు కర్మాగారాల ఆంగ్లేయ యంజమానులు తమ మీద సాగిస్తున్న దుర్మార్గాలను పూసగుచ్చినట్టు ఏకరువు పెట్ట సాగారు. భారత రైతాంగం వ్యధార్తభరిత గాథలను, ఆంగ్లేయ ప్లాంటర్ల భయంకర దోపిడి ఉదంతాలను గాంధీ, ఆయన న్యాయవాదుల బృందం నమోదు చేయడం ఆరంభించింది. గాంధీజీ వ్యవహార సరళి, అయన అనుసరిస్థున పద్దతులు, పరిస్థితులు తమకు ప్రతికూలం కాగలవని భయపడిన నీలిమందు కర్మాగారాల ఆంగ్లేయ యజమానులలో ఒకడైన ఇర్విన్ అనునతడు గాంధిజీ కార్యక్రమాలకు అంతరాయం కల్పించేందుకు ప్రయత్నించడం మాత్రమే కాకుండా ఆయనను అంతం చేయాలని కుట్రపన్నాడు.

## గాంధీజీ ప్రాణ రక్షకుడు

ఆ కుట్ర అమలుకు ఇర్విన్ తన ఇంట వంట మనిషిగా పనిచేస్తున్న బతక్ మియా అన్సారిని ఎన్నుకున్నాడు. మహాత్ముడు ఆయన సహచరులను విందుకు పిలుస్తున్నామని ఆతిధికి అందించే ఆహారంతో విషం కలపవలసిందిగా అన్సారీకి బాధ్యత అప్పగించాడు. మంచి బహుమతి కూడా ఆశచూపాడు, కాదంటే శిక్షలతో భయపెట్టాడు. ఆ దుష్ట చర్యకు మనస్కరించని అన్సారి మహాత్మాగాంధీ, బాబూ రాజేంద్ర ప్రసాద్ తో కలసి ఇర్విన్ ఇంటికి విందుకు వచ్చాక, ఆ ఆంగ్లేయుడి కుట్రను బట్టబయలు చేశారు. ఆ కారణంగా 1917లో మహాత్మాగాంధీ హత్యాయత్నం నుండి బయట పడగలిగారు.

ఈ విషయాన్ని 1950లో భారత ప్రధమ రాష్ట్రపతి డాక్టర్ బాబూ రాజేంద్ర ప్రసాద్ వెల్లడించిన తరువాత గాని బతఖ్ మియా అన్సారీ సాహస చరిత్ర ప్రపంచానికి తెలియరాలేదు. డాక్టర్ రాజేంద్ర ప్రసాద్ స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో అత్యంత ముఖ్యమైన

ఈ సంఘటను బహిర్గతం చేయడం మాత్రమే కాకుండా బతఖ్ మియా అన్సారీ కుటుంబ పరిస్థితులను విచారించి ఆయన కుటుంబానికి వ్యవసాయ భూమి కేటాయించమని జిల్లా కలెక్టరును ఆజ్ఞాపించారు. ఆనాడు ప్రధమ రాష్ట్రపతి బహిరంగంగా జారీచేసిన ఆ ఆదేశాలు ఈనాటికి పాక్షికంగా మాత్రమే అమలయ్యాయి.

ఆ తరువాత పూర్వరాష్ట్రపతి శ్రీమతి ప్రతిభా పాటిల్ జోక్యం చేసుకున్నా, ప్రతికల్లో ఈ విషయం హోరెత్తినా, అలనాటి రాష్ట్రపతి ఆదేశాల అమలు మాత్రం ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్టుగా మిగిలిపోయింది. మహాత్ముడి మీద ఆనాడు ఆంగ్లేయులు సాగించిన హత్యాయత్నం కుట్రను బతఖ్ అన్సారీ లాంటి సాహసి వమ్ముచేయకుండా ఉన్నట్టయితే వలస పాలకుల పెత్తనం నుండి మన దేశం విముక్తి పొంది ఈనాడు మనం అనుభవిస్తున్న స్వేచ్ఛా-స్వాతంత్ర్యాల పరిస్థితి ఏవిధంగా ఉండేదో, మన స్వాతంత్ర్యోద్యమ చరిత్ర ఏ మలుపులు తిరిగేదో మనం ఊహించనలవిగాని విషయం.

## జాతీయ స్థాయి ఉద్యమంలో అలీ సోదరుల అండ

1917లో సాగించిన చంపారన్ రైతాంగ ఉద్యమంలో విజయం సాధించిన గాంధీజీ భారత జాతీయోద్యమంలో ప్రత్యక్షంగా ప్రవేశించారు. స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో అలీ సోదరులుగా విఖ్యాతిగాంచిన మౌలానా షౌకత్ అలీ (1873-1938), మౌలానా మహమ్మద్ అలీ జౌహర్ (1878-1931) కుటుంబీకుల అండదండలు ఆయనకు పుష్కలంగా లభించాయి. 1919 నుండి జమిలిగా సాగిన సహాయ నిరాకరణ-ఖిలాఫత్ ఉద్యమమాలకు అలీ సోదరులు ప్రాణవాయువుగా మారగా మహాత్ముడు మార్గదర్శకం వహించారు. ఈ ఉద్యమాల సందర్భంగా గాంధీజీ జరిపిన పర్యటనలలో అలీ సోదరులు ఆయన వెంట ఉన్నారు. అలీ సోదరులతో మహాత్మాగాంధీ ఎంతగా మమేకమయ్యారంటే అలీ సోదరుల తల్లి ఆబాది బానో బేగం (1852-1924) కు అలీ సోదరులతోపాటుగా తాను మూడవ కుమారుడినని ఆయన ప్రకటించుకున్నారు. ఆబాది బానో బేగంను తల్లిగా పరిగణించిన మహాత్మాగాంధీ తాను ఆమె తృతీయ పుత్రుడనని పలు సందర్భాలలో చెప్పుకున్నారు. ఆమె పట్ల అత్యంత గౌరవాన్ని గాంధీజీ వ్యక్తపర్చారు. గాంధీజీ అలీ సోదరులకు, తన సహచరులకు రాసిన పలు లేఖలలో, స్వయంగా ఆబాది బానో బేగంకు రాసిన లేఖలలో, తన యంగ్ ఇండియా తదితర పత్రికలలో ప్రచురించిన ప్రత్యేక వ్యాసాలలో ఆమె పట్ల ఉన్న గౌరవాభిమానాలను చాలా విస్పష్టంగా వెల్లడించారు.

ఆబాది బానో బేగం ఖిలాఫత్-సహాయనిరాకరణ ఉద్యమం విస్తృతికి, ఆర్థిక పటిష్టతకు పలు పర్యటనలు జరిపి నిధుల సేకరించి ఉద్యమాభివృద్ధికి తోడ్పడ్డారు. ఖిలాఫత్-సహాయ నిరాకరణ, శాసనోల్లంఘన ఉద్యమాలలో మహిళలను పెద్ద సంఖ్యలో పాల్గొనేట్టుగా



MOULANA MOHAMMED ALI (1878-1931) MOULANA SHOWKATH ALI (1873-1938)

చేయాలని గాంధీజీ ఆమెకు చేసిన వినతి మేరకు ఆబాది బానో బేగం క్రియాశీలకంగా వ్యవహరించారు. ఖిలాఫత్-సహాయనిరాకరణ ఉద్యమం సందర్భంగా ఉద్యమిస్తున్న అలీ సోదరులను, తనను కనుక ఆంగ్ల ప్రభుత్వం నిర్బంధించినట్టయతే తమ స్థానంలో జాతీయోద్యమకారులు ఆబాది బానో బేగం నుండి తగిన మార్గదర్శకం పొందవలసిందిగా మహాత్మాగాంధీ ప్రకటించారు.

1924లో బీబి అమ్మ కనుమూసిన సందర్భంగా అలీ సోదరుల తోపాటుగా తాను కూడా ఆబాది బానో బేగం మంచం పక్కన ఉన్నారు. ఆ విధంగా తల్లి అంతిమ శ్వాస విడుస్తున్న సందర్భంగా తల్లి చెంత ఉండటం అదృష్టంగా భావిస్తున్నానని ఆయన చెప్పుకున్నారు. ఆబాది బానో బేగం కార్యదక్షతను, స్వేచ్ఛా, స్వాతంత్ర్యం కోసం, హిందూ-ముస్లిం ఐక్యత కోసం, మహిళలను జాతీయోద్యమం లోనికి ఆకర్షించడంలో ఆమె ఎనలేని కృషి సల్పారని గాంధీజీ తన లేఖలలో, తన పత్రికలలో పేర్కొన్నారు.

## ఒక సాహస మహిళ

ఆబాది బానో బేగం, ఆమె కోడలు, మౌలానా మహమ్మద్ అలీ భార్య అంజాది బానో తన అత్తగారితో కలసి జాతీయోద్యమంలో క్రియాశీలక పాత్రను నిర్వహించారు. ఆమె తీరు తెన్నులను, కార్య దక్షతను కూడా ప్రశంసిస్తూ తన సంపాదకత్వంలో వెలువడుతున్న



ABADI BANO BEGUM
(1852-1924)



AMZAADI BANO BEGUM
(1885-1947)

వివిధ పత్రికలలో, తన సహచరులకు, అనుచరులకు రాసిన పలు లేఖలలో గాంధీజీ కొనియాడారు. 1921 సెప్టంబర్ మాసంలో మహాత్మాగాంధీ, మౌలానా మహమ్మద్ అలీతో మద్రాసు వెడుతున్న సందర్భంగా అంజాది బానో కూడా వారి వెంట ఉన్నారు. ఆ ప్రయాణంలో వాల్తేరు వద్ద ప్రజలు ఏర్పాటు చేసిన సభలో గాంధీజీ, అలీ ప్రసంగించాల్సి ఉంది. 1921 సెప్టంబర్ 14న ఆ నాయకులిరువురు రైలు దిగగానే మహమ్మద్ అలీని ఆంగ్లేయ పోలీసు అధికారులు నిర్బంధంలోకి తీసుకున్నారు. ఈ సందర్భంగా అటు అలీ, ఇటు అంజాది బేగం చూసిన నిర్భీతిని గాంధీ రైలు పెట్టెనుండి వ్యాసం రూపంలో నమోదు చేశారు. ఆ వ్యాసంలో అలీతో కలసి పని చేయడం 'నాకు గర్వ కారణం' అని పేర్కొన్నారు. భర్త అరెస్టు సందర్భంగా అంజాది బానో వ్యక్తపర్చిన ధైర్యసాహసాలు, ఆ తరువాత సభలో ఆమె ప్రసంగించిన తీరు తెన్నులను గాంధీజీ కొనియాడారు. (COLLECTED WORKS OF MAHATMA GANDHI, MINISTRY OF INFORMATION, GOVT. OF INDIA, VOL XXI PAGE 176).

1921 నవంబర్ 29 నాటి YOUNG INDIA పత్రికలో అంజాది బానో బేగం జాతీయోద్యమంలో నిర్వహిస్తున్న బృహత్తర పాత్ర, ఆమె నిర్భయత్వం, సాహసం, వ్యవహార సరళి, కార్యదక్షత, కార్యశీలతను వివరిస్తూ 'ఒక సాహస మహిళ' శీర్షికన ప్రత్యేక వ్యాసం రాశారు. ఈ సుదీర్ఘ వ్యాసంలో మౌలానా మహమ్మద్ అలీ గురించి కూడా ప్రస్తావిస్తూ 'ఒక


MOHAMMED UMAR SOBHANI
(1890-1926)

సాహస భర్త యొక్క సాహస భార్య' అంటూ ఆమె గురించి గాంధీజీ పేర్కొన్నారు. జాతీయోద్యమంలో పాల్గొన్న అబాది బానో బేగం ఇంటి మహిళల కార్యాచరణను ఆంగ్లేయాధికారి మాల్కం హేలి ఆనాటి లెజిస్లేటివ్ అసెంబ్లీలో ప్రస్తావిస్తూ, 'ఈ ఇంటి మహిళలు కూడా చందాలు సేకరిస్తారు. విద్రోహానికి పాల్పడతారు' అన్నాడు. చివరకు ఆబాది బానో కుటుంబ సభ్యులందరిని 'ప్రమాదకర వ్యక్తులు' గా ప్రకటించాడు.

ఖిలాఫత్-సహాయనిరాకరణ ఉద్యమాల సందర్భంగా మహాత్మాగాంధీకి పలువురు ప్రముఖులతో సంబంధాలు ఏర్పడ్డాయి. భారత రాజకీయ చిత్రపటం మీద తమదైన ముద్రను ఏర్పాటు చేసుకున్న నేతలు గాంధీజీకి సన్నిహిత సహచరులు అయ్యారు. ఈ నేతలు జాతీయోద్యమంలో తమ సర్వం సమర్పించడానికి సిద్ధపడ్డారు. ఆ క్రమంలో బొంబాయికి చెందిన మహమ్మద్ ఉమర్ సోభాని (1890-1926), కర్ణాటకకు చెందిన ఖిలాఫత్‌వాలే హాజి ఉస్మాన్ సేట్ (1887-1932) తమ విశిష్ట దాతృత్వంతో గణుతికెక్కారు. సంపన్న వ్యాపార వేత్తలుగా తమదైన వ్యాపార రంగాన్ని ఏలుతున్న ఈ ఇరువురు ఖిలాఫత్ -సహాయ నిరాకరణ ఉద్యమాల ద్వారా జాతీయోద్యమంలో ప్రవేశించారు.

## 'స్టేజ్ మేనేజర్'

జాతీయోద్యమంలో భాగంగా బొంబాయిలో ఏ కార్యక్రమం జరిగినా ఆ కార్యక్రమం నిర్వహాఖర్చులో సింహభాగాన్ని ఉమర్ సోభాని భరించేవారు. ఆర్థికంగా ఆదు కోవడం మాత్రమే కాకుండా కార్యదక్షుడుగా పేర్గాంచారు. ఆ కారణంగా ఆయనను 'స్టేజ్ మేనేజర్' అని గాంధీజీ ప్రశంసించారు. 1921లో 'తిలక్ స్వరాజ్య నిధి' కోసం విరాళాలు సేకరిస్తుండగా గాంధీజీకి బ్లాంక్ చెక్కు ఇచ్చి ఇష్టమొచ్చినంత రాసుకోండన్న వితరణశీలి ఉమర్ సోభాని. జాతీయోద్యమ కార్యక్రమాల నిర్వహణకు సేకరిస్తున్న 'చందాల జాబితాలో తన పేరు మొదటగా లేనప్పుడు తాను ఇక బ్రతికి ఉండటం ఎందుకంటూ పరలోక గతుడయ్యాడు', (If he could not be the first on the list of subscriptions then he



KHILAFATWALE HAJI USMAN SAIT (1887-1932)

thought it was better for him to retire from public life) అని ఆయన ఆకస్మిక మరణం సందర్భంగా గాంధీజీ విడుదల చేసిన సంతాప సందేశంలో పేర్కొనడం జాతీయోద్యమానికి ఆర్థికంగా ఆదుకోవాలన్న ఉమర్ సోభాని సంకల్పాన్ని నిశ్చయాన్ని, నిబద్ధతను బహిర్గతం చేస్తుంది.

## 'క్యాష్ బ్యాగ్ ఆఫ్ ఇండియన్ నేషనల్ కాంగ్రెస్'

'ఖిలాఫత్‌వాలే' గా సుప్రసిద్దులైన హాజి ఉస్మాన్ సేఠ్ బెంగుళూరులో విదేశీ వస్తువుల క్రయ-విక్రయాలు చేస్తున్న అత్యం సంపన్న వ్యాపారి. మహాత్మాగాంధీ, అలీ సోదరుల వినతి మేరకు ఆయన జాతీయోద్యమంలో ప్రవేశించారు. స్వదేశీ ఉద్యమంలో భాగంగా తన 'క్యాష్ బజార్ స్టోర్స్' లోని లక్షలాది రూపాయల విలువ చేసే విదేశీ వస్తువులను దహనం చేశారు. జాతీయోద్యమ నాయకులు మహాత్మాగాంధీ, అలీ సోదరుల వినతి ఉద్యమ అవసరాలకు ఆర్థికంగా తోడ్పడుతూ 'క్యాష్ బ్యాగ్ ఆఫ్ ఇండియన్ నేషనల్ కాంగ్రెస్'గా పిలువబడ్డారు. ఆంగ్లేయుల ఆగ్రహానికి గురికాబడి వ్యాపారం పూర్తిగా దెబ్బతిన్నప్పటికీ, ఆ కష్టనష్టాలను ఏమాత్రం ఖాతరు చేయకుండా గాంధిజీ, అలీ సోదరులు, పండిత నెహ్రూ తదితర భారత జాతీయ కాంగ్రెస్ నాయకులు అడిగినప్పుడల్లా తన బంగ్లాలను, ఇతర అస్తులను అమ్మివేసి బంగారం, బ్లాంక్ చెక్కులు, అడిగినంత నగదును జాతీయోద్యమానికి అందించారు. ఆస్తి పూర్తిగా కరిగి పోయాక కూడా 'క్యాష్ బ్యాగ్ ఆఫ్ ఇండియన్ నేషనల్ కాంగ్రెస్' అన్న పేరును నిలబెట్టుకుంటూ తన కుమారుడ్ని వేలంపాటకు పెట్టి ఆవిధంగా ధనాన్ని సమకూర్చి విరాళం అందించిన త్యాగశీలి హాజి ఉస్మాన్ సేట్.

## అన్సారి ధర్మశాల

భారత జాతీయోద్యమం కార్యక్రమాలకు ఢిల్లీ ప్రధాన వేదికయ్యాక ఢిల్లీలోని ప్రముఖ జాతీయోద్యమ నేత డాక్టర్ ముక్తార్ అహమ్మద్ అన్సారి (1880-1936) విశాలమైన ప్రాంగణం గల నివాసం 'దార్-ఉస్-సలాం' (DAR-US-SALAM) కార్యస్థానం అయ్యింది.

భారతదేశం మొత్తం మీద నుండి ఎంతమంది కార్యకర్తలు, నాయకులు ఢిల్లీ వచ్చినా, ఎంత పెద్ద కార్యక్రమం అయినా ఆ కార్యక్రమ నిర్వహణ, నాయకుల/కార్యకర్తల బస, తిండితిప్పల ఏర్పాటు బరువు బాధ్యతలను డాక్టర్ అన్సారి నిర్వహించేవారు. ఆయన రాజకీయ కార్యక్రమాలలో మునిగి తేలుతుండగా బస, వసతి, ఆహరం విషయంలో ఎవ్వరికి ఏ లోటు రాకుండా ఆయన ధర్మపత్ని బేగం షంషున్నీసా అన్సారి పర్యవేక్షణలో సాగేవి.

ఈ అన్సారి దంపతుల త్యాగశీలత, కార్యదక్షత, నిబద్ధతలను సమీపం నుండి పలుమార్లు దర్శించిన మహాత్మా గాంధీ 1931 మార్చి 29 నాటి నవజీవన్ పత్రికలో 'అన్సారి ధర్మశాల' శీర్షికతో వ్యాసం రాశారు. ఈ వ్యాసంలో డాక్టర్ అన్సారి ఇంట అతిథ్యం లంభించే తీరుతెన్నులను, ఆయా కార్యక్రమాల నిర్వహణలో బేగం షంషున్నీసా అన్సారి చూపిస్తున్న శ్రద్ధను ప్రశంసించారు. ఈ సందర్భంగా బేగం షంషున్నీసా దయాగుణాన్ని, సహన శీలతను, కార్య నిర్వహణా దక్షతనేకాక, ఆమె ప్రగతిశీల భావాలను కూడా ఎంతగానో కొనియాడారు. ఆ వ్యాసం చివరిలో, 'అన్సారి బేగం సమక్షాన శ్రద్ధా భావనలతో నా శిరస్సు వంచాను' (మైనే శ్రద్ధా భావ్‌సే అప్‌నా శిర్ బేగం అన్సారి కే సమక్ష్ మే ఝుకా దియా) అని పేర్కొన్నారు. మహాత్మా గాంధీ తన ఢిల్లీ పర్యటనలో డాక్టర్ అన్సారి ఇంట బసచేసేవారు. ఆ సందర్భంగా బేగం అన్సారితో కుటుంబ విషయాలనే కాకుండా, జాతీయోద్యమ కార్యక్రమాల గురించి కూడా గాంధీజీతో చర్చించేవారని HALIDE EDIB రచనల ద్వారా తెలుస్తోంది. ఆ సన్నిహితత్వం నేపథ్యంలో మహాత్ముడు ఆ మహనీయురాలి పట్ల అపూర్వ గౌరవాన్ని ప్రకటిస్తూ 'డాక్టర్ అన్సారి ఏమి సాధించినా అదంతా బేగం షంషున్నిసా సహకారంతో మాత్రమే'నన్న ప్రశంసను ఆమె అందుకున్నారు.

## ముగ్గురు గాంధీలు

భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో గాంధేయ మార్గాన నడిచి గాంధి పేరుతో ముడివడిన పేర్లతో విఖ్యాతులైన వ్యక్తులు నాకు తెలిసినంత వరకు ముగ్గురున్నారు. అందులో ప్రఖ్యాత వ్యక్తి 'సరిహద్దు గాంధీ'గా సుప్రసిద్ధులైన ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ (1890–1988) కాగా, ప్రజలచేత 'బెలూచి గాంధీ' ప్రేమగా పిలువబడిన రెండవ నేత ప్రస్తుత పాకిస్థాన్‌లోని బెలూచిస్తాన్‌కు చెందిన యోధులు ఖాన్ అబ్దుస్ సమద్ ఖాన్ (1907–1973). ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం విశాఖపట్టణం నివాసి 'విశాఖ గాంధీ' ప్రసిద్ధుడైన ఫరీద్దుల్ జమా (1907–1983) ఉన్నారు. 1920లో గాంధీజీ అహింసా సిద్ధాంతంతో ఆకర్షితుడైన ఖాన్ అబ్దుస్ సమద్ ఖాన్ గాంధేయ మార్గంలో చివరి వరకు సాగుతూ గాంధీజీలాగే ఆయన హత్యకుగురయ్యారు. ఆహింస ఆయుధంగా జాతీయోద్యమంలో పాల్గొన్న ఫరీద్దుల్ జమా మహాత్మాగాంధీ నిర్బంధించబడిన జైలులో గడపటం, ఆ తరువాత గాంధిజీ మార్గంలో గ్రంధాలయోద్యమానికి



DR. MUQTAR AHAMED ANSARI
(1880-1936)

ప్రాధాన్యతనిస్తూ తనకున్న ఆస్తిని, స్థలాలను గ్రంథాయాల భవనాల నిర్మాణానికి స్థాపనకు ఉదారంగా వ్యయం చేయడంతో విశాఖ పట్టణం పుర ప్రజలు ఆయనను 'విశాఖ గాంధీ'గా ఎంతో ప్రేమగా పిలుచుకున్నారు.

భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో సరిహద్దుగాంధిగా విఖ్యాతుడైన ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ (1890-1988) తొలి నుండి వలస పాలకుల ఆధిపత్యాన్ని నిరసిస్తూ వచ్చారు. 1919లో ఆయన భారత జాతీయోద్యమంలో ప్రవేశించారు. 1928లో మొట్ట మొదటిసారిగా మహాత్మా గాంధీని చూసారు. ఆయుధం ఆభరణంగా కలిగి ఉంటూ, మిత్రుని కోసం ప్రాణం ఇవ్వడానికి, శత్రువు ప్రాణం తియ్యడానికి ఏమాత్రం సంకోచించని పఠాన్ జాతి జనుల నాయకుడు ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ మహాత్ముడి అహింసా సిద్ధాంతం పట్ల ఆకర్షితులయ్యారు. ఆయన మహాత్ముడి ఆహింసాయుత కార్యాచరణను యధాతధంగా అమలు పర్చుతూ జాతి జనులలో సంక్షేమం-అభివృద్ధి దిశగా చైతన్యం తీసుక రావడానికి, వలస ప్రభువులకు వ్యతిరేకంగా అహింసోద్యమం నడపడానికి 'ఖుదా-యే- ఖిద్మత్‌గార్' (భగవత్సేవకులు) సంస్థను 1929లో స్థాపించారు. ఆయన కృషి, కార్యచరణ ద్వారా భగవత్సేవకులు ఆహింసా సిద్దాంతాన్ని బాగా వంట పట్టించుకున్నారు. శాసనోల్లంఘన ఉద్యమం సందర్భంగా 1930 ఏప్రిల్ 23న పెషావర్ లోని ఖిస్సాఖాని బజార్‌లో ప్రదర్శన జరపడానికి విచ్చేసిన ప్రజలు, భగవత్సేవకుల మీద ఆంగ్లేయ పోలీసులు, సైన్యం తుపాకులు ఎక్కుపెట్టి కాల్పులు జరుపుతున్నా చిన్న రాయి ముక్క కూడా విసరకపోగా జట్లు జట్లుగా ముందుకు వస్తూ ప్రాణత్యాగాలు చేశారు. ఖిస్సాఖాని బజార్ అనాడు శవాలదిబ్బగా మారిపోయింది తప్ప ఆహింసా మార్గాన్ని మాత్రం వీడలేదు.

భారత స్వాతంత్ర్యోద్యమంలో సరిహద్దు గాంధీ మార్గదర్శకంలో ఖుదా-యే-ఖిద్మత్‌గార్ యోధులు పోషించిన అద్వితీయమైన పాత్ర, స్వజనులచే మాత్రమే కాకుండా ప్రపంచ ప్రజలందరి జేజేలు అందుకుంది. సరిహద్దు గాంధీ అభ్యర్థన మేరకు వాయవ్య



KHAN ABDUL SAMAD KHAN
(1907-1973)



FHAREEDULA JAMA
(1907-1983)

సరిహద్దు రాష్ట్రంలో పర్యటించిన మహాత్మాగాంధీ ఖుదా-యే-ఖిద్మత్‌గార్‌ల కార్యక్రమాలను అధ్యయనం చేసాక మాట్లాడుతూ, 'ఖుదా-యే-ఖిద్మత్‌గార్ కార్యకర్తల్లా ఓ వెయ్యిమంది తయారయితే చాలు, బానిసత్వమనే సామాజిక రుగ్మతను దేశం సరిహద్దులను దాటించవచ్చు' అని ప్రశంసించారు. ఈ కార్యచరణ నేపథ్యంలో ఒకసారి గఫార్ ఖాన్ మాట్లాడుతూ, '...మహాత్మాజీ ! ఈ ఉద్యమకాలంలో దేశం లోని పలు ప్రాంతాలలో దౌర్జన్యాలు జరిగినాయి. కానీ పఠాన్‌లు ఏ దౌర్జన్యమూ చేయలేదే ?...' మని ప్రశ్నించారు. ఈ ప్రశ్నకు సమాధానంగా, 'అహింసా మార్గం, ధైర్యం కలవారికే త్వరగా అలవడుతుందని నేను అనేక సందర్భాలలో చెప్పాను. పఠాన్లు దౌర్జన్యాన్ని వదలుకోవడం బలహీనతకాదు. బలం ఉండటం వలననే. అందువలన ధైర్యం కలవారి అహింసా మార్గం ఎట్లా ఉంటుందో వారు చూపెట్టగలిగారు.' అని గాంధీజీ ప్రశంసించారు. (భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లిం ప్రజాపోరాటాలు, సయ్యద్ నశీర్ అహమ్మద్, ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్, 2003, పేజి.160-161).

## గుజరాతి వజ్రం

భారత జాతీయ కాంగ్రెస్ స్థాపించిన కాలం నాటి నుండి బొంబాయికి చెందిన తయ్యాబ్జీ కుటుంబీకులకు కాంగ్రెస్‌తో విడదీయ లేని సంబంధాలు ఉన్నాయి. ఆ కుటుంబానికి చెందిన జస్టిస్ అబ్బాస్ తయ్యాబ్జీ (1854-1936) 1915లో మహాత్మా గాంధీజీతో కలిగిన



MAHATMA GANDHI (1869-1948) SARIHAD GANDHI (1890-1988)

ప్రత్యక్ష పరిచయం, ఆయన జీవితాన్ని మలుపు తిప్పింది. గాంధీజీ సూచన మేరకు జాతీయోద్యమంలో చురుగ్గా పాల్గొనేందుకు ఆయన సంసిద్ధులయ్యారు. 1919లో కాంగ్రెస్ సహాయనిరాకరణ ఉద్యమాన్ని ఆరంభించక ముందే అబ్బాస్ నాయకత్వం లోని 'గుజరాత్ రాజకీయ పరిషత్' సహాయనిరాకరణ ఉద్యమాన్ని చేపట్టింది. మహాత్ముడి ప్రేరణతో అన్ని విలాసాలకు స్వస్తి పలికిన అబ్బాస్ స్వదేశీ ఉద్యమంలో భాగస్వామి అయ్యారు. ఖద్దరును ప్రోత్సహించేందుకు ఎనభై సంవత్సరాల వయస్సులో ఎద్దుల బండిలో 'విముక్తి వస్త్రాన్ని' విక్రయిస్తూ గుజరాత్ రాష్ట్రంలోని గ్రామాల్లో తిరిగారు. 1928 బార్డోలి సత్యాగ్రహ కార్యక్రమంలో పలు బాధ్యతలు చేపట్టారు. 1930 12 మార్చి నుండి ఏప్రిల్ ఆరు వరకు సాగిన దండియాత్ర సందర్భంగా బ్రిటిష్ ప్రభుత్వం గాంధీజీని అరెస్టు చేసినప్పుడు, ఆయన ముందస్తు ఆదేశాల మేరకు అబ్బాస్ దండి సత్యాగ్రహ ఉద్యమ నాయకత్వం చేపట్టారు. ఆంగ్లేయులు ఆయనను ఆరెస్టు చేసి జైలుకు పంపారు. పండు వయస్సులో కూడా మొక్కవోని ధైర్యంతో, అనారోగ్యాన్ని కూడా లెక్కచేయక విముక్తి పోరాటమే ఊపిరిగా గాంధేయ బాటన సాగిన జస్టిస్ అబ్బాస్ తయ్యాబ్జీ 'గుజరాతి వజ్రం'గా మహాత్ముడి ప్రశంసలను అందుకున్నారు. (ENCYCLOPAIDIA OF MUSLIM BIOGRAPHY, EDITED BY NAGENDRA KR. SINGH, APH PUBLISHING CORPORATION NEW DELHI, 2001, PAGE.377)



JUSTICE ABBAS TAYABJI (1854-1936) AND MAHATHMA GANDHI

## గాంధేయ బాటలో మూడు తరాల తయ్యాబ్జీలు

1885లో భారత జాతీయ కాంగ్రెస్ స్థాపన నాటి నుండి 1947లో స్వాతంత్ర్యం లభించేంత వరకు బొంబాయిలోని విద్యాధిక, సంపన్న తయ్యాబ్జీ కుటుంబానికి చెందిన మూడు తరాల పురుషులు-స్త్రీలు భారత స్వాతంత్ర్యోద్యమంలో గణనీయమైన పాత్రను నిర్వహించారు. ఆ కుటుంబంలోని సభ్యులకు సంబంధించిన వ్యక్తిగత విషయాలను కూడా గాంధీజీతో చర్చించేవారు. ఈ క్రమంలో తయ్యాబ్జీ కుటుంబానికి చెందిన పురుషులతోపాటుగా మహిళలు కూడా గాంధేయ మార్గాన్ని పూర్తి స్థాయిలో అనుసరించారు.

జాతీయోద్యమంలో తయ్యాబ్జీ కుటుంబ మహిళల భాగస్వామ్యం అమీనా తయ్యాబ్జీ (1866-1942) తో ఆరంభమయ్యింది. మహాత్మా గాంధీ ప్రత్యక్ష ఆహ్వానం మేరకు జాతీయోద్యమ కార్యకలాపాలను ఆమె నిర్వహించారు. అమినాలో గల పట్టుదల గుజరాత్ మహిళలలో ఆమెపట్ల ఉన్న గౌరవాన్ని గమనించిన గాంధీజీ 1930 ఏప్రిల్ 11న రెహనా తయ్యాబ్జీ పేరిట ఓ లేఖ రాస్తూ 'మధ్యపాన నిషేధం, విదేశీ వస్తువుల బహిష్కరణ తదితర అంశాల మీద గుజరాత్ మహిళల సమావేశం ఏర్పాటు చేస్తున్నాను. ఆ సమావేశానికి నీవు, మీ అమ్మ గారు తప్పక హాజరుకావాలి' అని ప్రత్యేకంగా కోరారు. స్వయంగా మహాత్ముడు పంపిన ఆహ్వానాన్ని గౌరవిస్తూ అమినా సమావేశానికి హాజరయ్యారు. ఆ


BEGUM AMEENA TYABJI
(1866-1942)

సమావేశంలో గాంధీజీ సమక్షంలో గుజరాత్ మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలిగా అమీనా తయ్యాబ్జీ ఎంపిక అయ్యారు. ఆమె కృషి, కార్యదక్షతను గమనించిన గాంధీజీ తన యంగ్ ఇండియా, నవజీవన్ పత్రికలలో 'తగిన తీర్మానం చేసి గుజరాత్ మహిళలు మహత్తరమైన బాధ్యతను స్వీకరించారు. ఆ బరువును మహిళల పక్షాన అమీనా తయ్యాబ్జీ ఆమె కమిటీ భరించారు' అని ప్రశంసించారు. భారత జాతీయోద్యమం సాగుతున్న నేపథ్యంలో మహిళా కాంగ్రెస్ పక్షాన వైస్రాయికి పంపిన లేఖలో 24 మంది మహిళల సంతకాలతో పాటుగా అమీనా తయ్యాబ్జీ సంతకాన్ని మహాత్మా గాంధీజీ స్వయంగా కోరడం ద్వారా జాతీయ స్థాయిలో ఆమె ప్రాధాన్యత వెల్లడయ్యింది.

మహాత్ముడి బాటలో జాతీయోద్యమం లోని అన్ని కార్యక్రమాలలో హమిదా తయ్యాబ్జి (1911-) పాల్గొన్నారు. ఆమె మహాత్ముని సూచనల మేరకు గుజరాత్‌లో ప్రతి కార్యక్రమాన్ని ధైర్య సాహసాలతో నిర్వహించారు. ఆమె కార్యక్రమాల నిర్వహణా సరళిని, ధైర్యసాహసాలను ప్రశంసిస్తూ 1932 ఏప్రిల్ 24న బేగం రెహనా తయ్యాబ్జీకి గాంధీజీ రాసిన లేఖలో 'హమీదా ఎంతో ధైర్యవంతురాలు. హమీదాకు మరింత ఆయుష్షును భగవంతుడు ప్రసాదించాలని కోరుకుంటున్నాను' అని ఆయన పేర్కొన్నారు.

## గాంధీజీకి ఉస్తాది సాహెబా రెహనా

గాంధీజీకి ఉర్దూ భాషను నేర్పిన గురువు బేగం బేగం రెహనా తయ్యాబ్జీ (1900-1975). రెహానా తండ్రి జస్టిస్ అబ్బాస్ తయ్యాబ్జీ, తల్లి అమీనా తయ్యాబ్జీలు మహాత్ముని నేతృత్వంతో సాగిన పలు కార్యక్రమాలలో పాల్గొన్నారు. చిన్ననాటి నుండే రెహనాకు జాతీయోద్యమం, జాతీయోద్యమ నేతలు ప్రధానంగా మహాత్మాగాంధితో ప్రత్యక్ష పరిచయాలు ఏర్పడ్డాయి. రెహానా తయ్యాబ్జీ ని తన కుమార్తెగా భావించిన గాంధీజీ 'ప్రియపుత్రి, చిరంజీవి, రెహానా బేటిగా, బేటి రెహానా, ఉస్తాది సాహెబా, పాగల్ రెహానా, భోలి బేటి' అని తాను వివిధ సందర్భాలలో రాసిన పలు ఉత్తరాలలో ఆమెను సంబోధించారు. మహాత్ముని సేవాగ్రాం


BEGUM REHANA ABBAS TYABJI
(1900-1975)

ఆశ్రమంలో రెహానా తయ్యాబ్జీ గడిపిన సమయంలో గాంధీజీకి ఆమె ఉర్దూ భాష నేర్పారు. ఆ తరువాత కూడా ఆమె గాంధీజీకి తరచూ ఉత్తరాలు రాస్తూ ఉర్దూ భాష నేర్పడం మీద ఎంతో శ్రద్ధ చూపారు. ఆమె నుండి ఉత్తరాలు అందుకోవడం తనకు ఎంతో ఆనందదాయకమని చెప్పుకున్న గాంధీజీ 'నీ ఉత్తరం అందకుంటే నా మనస్సు గందరగోళంగా ఉంటుంది' అని ఆమెకు రాసిన ఒక లేఖలో పేర్కొన్నారు. 1930 ఏప్రిల్ 11న రెహానా తయ్యాబ్జీకి గాంధీజీ ఓ లేఖ రాస్తూ 'మధ్యపానం, విదేశీ వస్తువుల బహిష్కరణ తదితర అంశాల మీద గుజరాత్ మహిళల సమావేశం ఏర్పాటు చేస్తున్నాను. ఆ సమావేశానికి నీవు, మీ అమ్మగారు తప్పక హాజరుకావాలి' అని కోరగా ఆ సమావేశానికి రెహానా తన తల్లి అమినా తయ్యాబ్జీ తోపాటుగా హాజరయ్యారు. రెహానా చక్కని కవయిత్రి. స్వయంగా పలు ప్రార్థనా గీతాలను రాశారు, పాడారు. 'నీ ప్రార్థనా గీతాలు విననిదే నాకు బాగుండటం లేదు, నీవు వచ్చి పాడి విన్పించు' అని గాంధీజీ ఆమెకు రాసిన ఉత్తరాలలో పేర్కొన్నారంటే బేగం రెహనా తయ్యాబ్జీ గీతాలు ఆయనను ఎంతగా ఆకట్టుకున్నాయో తెలుస్తుంది.

## 'ప్రతిష్టాత్మక ధర్మపత్ని' ఖుర్షీద్ ఖ్వాజా

జాతీయోద్యమంలో భాగంగా 'నా భర్త సహచరులంతా జైళ్ళకు వెళ్ళారు. నా భర్త మాత్రం ఇంత వరకు స్వేచ్ఛగా ఉండటం పట్ల మాకు చాలా బాధగా ఉంది' అని ఆవేదన వ్యక్తంచేస్తూ గాంధీజీకి లేఖ రాసిన మహిళ బేగం ఖుర్షీద్ ఖ్వాజా (1896-1981). ఆమె భావనలను గౌరవిస్తూ 'నిజమైన నిబద్ధతతో కూడిన భావనలు ఇలా ఉంటాయి. స్వాతంత్ర్యం కోసం స్త్రీ, పురుషులంతా ఇలాగే జైళ్ళను నింపటానికి సంతోషంగా ముందుకు వచ్చిన రోజున స్వరాజ్యం తప్పక లభిస్తుంది' అని మహాత్మాగాంధీ ఆశాభావాన్ని వ్యక్తం చేశారు. (Collected Works of Mahathma Gandhi, Govt. Of India Publications, New Delhi). ఆమె, ఆమె భర్త ఖ్వాజా అబ్దుల్ మజీద్ భారత జాతీయోద్యమంలో



BEGUM KHURSHID KHAWAJA
(1896-1981)

చూపిన త్యాగగుణ సంపన్నతను వివరిస్తూ, 'మహానీయురాలైన ప్రతిష్టాత్మక ధర్మపత్ని' అను శీర్షికతో గాంధీజీ రాసిన ఒక వ్యాసం రాశారు. ఆ వ్యాసంలో ఆమె కుటుంబం సంపన్నుల సుఖభోగాలను వదలి సాదాసీదా ఉద్యమకారుల జీవితాన్ని అనుసరించడం, ఆమె కార్యనిర్వహణాదీక్ష, జాతీయోద్యమ లక్ష్యాల పట్ల ఉన్న ఆమె నిబద్ధత గురించి మహాత్ముడు ప్రత్యేకంగా ప్రస్తావించారు. ఒక వ్యాసంలో 'ప్రభుత్వం నా భర్తను అరెస్టు చేసిందన్న విషయం తెలుసుకున్న మీాకు ఆనందం కలిగి ఉంటుంది' అని బేగం ఖుర్షీద్ తనకు రాసిన లేఖను ప్రస్తావిస్తూ గాంధీజీ ఎంతో సంతోషం వ్యక్తంచేశారు.

సుప్రసిద్ధ తయ్యాబ్జీ కుటుంబానికి చెందిన మరోక మహిళా సకీనా లుక్మాని (1865–1960) జస్టిస్ బద్రుద్దీన్ కుమార్తె. మహాత్మాగాంధీ ప్రత్యేక ఆహ్వానం మేరకు పెద్ద వయస్సులో కూడా జాతీయోద్యమ కార్యకలాపాలలో చురుగ్గా పాల్గొన్నారు. గుజరాత్‌లో ఆంగ్లేయ ప్రభుత్వం ఆమెను అరెస్టు చేయగా అందుకు నిరసనగా యావత్తు గుజరాత్ ప్రజావళి కదంతొక్కింది. ఆమె ధైర్యసాహసాలను 'తయాబ్జీ పరివారం సభ్యులు అసాధారణ ధైర్య సాహసాలను ప్రదర్శించారు' అంటూ సకీనా లుక్మానిని గాంధీజీ ప్రసంశించారు.

## ప్రియపుత్రిక అమతుస్సలాం

మహాత్మాగాంధీ దంపతుల 'పిర్రియపుత్రిక'గా పరిగణించబడిన బీబి అమతుస్సలాం (1907–1985) మహాత్ముని అహింసా సిద్ధాంతం, కార్యాచరణకు వారసురాలయ్యింది. 1931లో సేవాగ్రాం చేరిన ఆమె ఆశ్రమం నిర్ధేశించిన కఠిన నియమనిబంధనలను పూర్తిగా పాటిస్తూ, అంకిత భావంతో బాధ్యతలు నిర్వహిస్తూ జాతీయోద్యమంలో భాగంగా జైలు కెళ్ళారు. జైలు నుండి విడుదల కాగానే సేవాగ్రాం వచ్చి బాపూజీకి వ్యక్తిగత సహాయకురాలిగా బాధ్యతలు నిర్వహించారు. గాంధీజీ సన్నిహిత సహాయకురాలిగా ఆయన సాగించిన పలు ప్రయోగాలలో ఆమె పాల్గొన్నారు. గాంధిజీ భారతదేశం వ్యాప్తంగా సాగించిన పర్యటనలలో ఆమె ఆయన వెంట ఉంటూ సేవలందించారు.

మహమ్మదాలి జిన్నా 'ఖాయిదే ఆజం' (గొప్ప నాయకుడు) పేరుతో విఖ్యాతుడు గావటంలో బీబి అమతుస్సలాం పాత్ర ఉంది. మహాత్ముడు జిన్నాకు లేఖ రాస్తున్న సందర్భంగా ఆయనను ఏవిధంగా సంభోదించాలన్న విషయం మీద మల్ల గుల్లాలు పడుతున్న సమయంలో 'ఖాయిదే ఆజం' అని సంభోదిస్తే బాగుంటుందని ఆమె సూచించారు. ఆమె సలహాను పాటిస్తూ జిన్నాకు రాస్తున్న గాంధీజి తన లేఖారంభాన QAID-I-AZAM అని సంబోధించారు. ఆ పదంతో జిన్నా వ్యక్తిగత ప్రతిష్ట అనూహ్యంగా పెరిగింది. అది భారత రాజకీయాలలో పెను మార్పుకు కారణం అయ్యిందని మౌలానా అబుల్ కలాం తన India Wins Free-dom (Page. 96-97) లో వివరించారు.


BEGUM SAKINA LUKMANI
(1865-1960)

భారత వాయవ్య సరిహద్దులు, సింధ్, నౌఖాళి ప్రాంతాలలో మత కలహాలు రగిలినప్పుడు శాంతి-సామరస్య స్థాపనకు అమతుస్సలాంను గాంధీజీ అక్కడకు పంపారు. ఆ సందర్భంగా మిత్రుడు ఆనంద్ హింగోరికి 1940 నవంబరు 6న ఉత్తరం రాస్తూ 'సింధ్‌లో జరుగుతున్న ఘర్షణలను ఆపేందుకు ఆమె ప్రాణాలను అరచేతిలో పెట్టుకుని వస్తుంది...ఆమె చాలా ధైర్యస్థురాలు, హింసాకాండను అడ్డుకునేందుకు ఆమె తన ప్రాణాలను సైతం పణంగా పెట్టగలదు' అని పేర్కొన్నారు. ఆమె అక్కడ 20 రోజులపాటు సత్యాగ్రహదీక్ష చేసి బీబి అమతుస్సలాం గాంధీజీకి నిజమైన వారసురాలు అన్పించుకున్నారు.

## త్యాగగుణ సంపన్నులు

'త్యాగగుణ సంపన్నులు' అని గాంధీజీ నుండి ప్రశంసలు అందుకున్న డాక్టర్ ముక్తార్ అహ్మద్ అన్సారి, బేగం షంషున్నీసా అన్సారి కుమార్తె బేగం జోహరా అన్సారి తల్లితండ్రుల త్యాగగుణాన్ని సంతరించుకున్నారు. ఆమె తల్లితండ్రులకు మించిన త్యాగశీలతతో బేగం జొహరా అన్సారి (-1988) గాంధీజీ ఆశీస్సులను అందుకున్నారు. ఆమె చాలా కాలం గాంధిజీ వద్ద ఆశ్రమంలో గడిపారు. ఆ సమయంలో గాంధీజీకి ఆమె ఉర్దూ ఉపాధ్యాయురాలు అయ్యారు. జాతీయోద్యమానికి, భారత జాతీయ కాంగ్రెస్ కార్యకలాపాలకు



నౌఖాళిలో మతకలహాలు రగిలినప్పుడు శాంతి–సామరస్య స్థాపనకు బేగం అమతుస్సలాం 20 రోజులపాటు సత్యాగ్రహదీక్ష పూనిన సందర్భంగా ఆమెకు పండ్లరసం అందించి సత్యాగ్రహ విరమణగావిస్తున్న గాంధీ.

ఆమె తల్లితండ్రుల నుండి తనకు సంక్రమించిన ఆస్తిపాస్తులను కరిగించి వ్యయం చేసి జీవిత చరమాకం అద్దె గృహంలో గడిపారు.

## ఉర్దూ ముస్లింల భాష కాదు

మహాత్మాగాంధీ పట్ల ఎంత గౌరవం ఉన్నా ఆయనతో ఏకీభావన కుదరని అంశాల మీద నిక్కచ్చిగా, నిర్మోహమాటంగా మాట్లాడిన జాతీయోద్యకారిణి సుల్తానా హయాత్ అన్సారి. ఆమె 1942లో సేవాగ్రాం ఆశ్రమంలో మహాత్మాగాంధి లేఖలను, గ్రంథాలను ఉర్దూలోకి తర్జుమా జేస్తూ ఆయనకు సన్నిహితంగా గడిపారు. కరాచిలో జరగనున్న జాతీయ కాంగ్రెస్ సమావేశాల సందర్భంగా వ్యక్తిగత సత్యాగ్రహాన్ని ఓ నియమంలా కాకుండా ఓ నీతిలా అనుసరించాలన్న ప్రతిపాదన గురించి అప్పుడు పత్రికల్లో చర్చ జరుగుతుంది. ఆ చర్చ నేపథ్యంలో సుల్తానా హయాత్ గాంధీజీకి లేఖ రాశారు. ఆ లేఖలో కాంగ్రెస్ ప్రతిపాదనను ఆయన దృష్టికి తెస్తూ, వ్యక్తిగత సత్యాగ్రహం నియమం కాకుండా నీతి అని భావించినట్టయితే అది గాంధేయ మార్గానికి విరుద్ధం అవుతుంది కదా? అని గాంధీజీని ప్రశ్నించారు. ఆ ప్రశ్నకు సమాధానంగా 1942 జనవరి 27న సుల్తానా హయాత్‌కు గాంధీజీ లేఖ రాస్తూ 'ఈ విషయం మీద నీ అభిప్రాయం సరైనది' అని పేర్కొన్నారు. ఓసారి 'ఉర్దూ భాష ముస్లింల భాష' అని ఆయన అన్నట్టుగా పత్రికలలో వచ్చింది. అది చూసిన సుల్తానా

హయాత్ ఉర్దూ ముస్లింల భాష ఏమాత్రం కాదు, ఇది భారతీయులందరి భాష కాగా మీరు అలా ఎందుకన్నారని గాంధీజీని ప్రశ్నించారు. ఆ ప్రశ్నకు సమాధానంగా 'నేను అలా అనలేదు. ఏంచేద్దాం ? పత్రికలలో చాలా విషయాలు తప్పులు రాస్తున్నారు' అని ఆయన సుల్తానాకు గాంధీజీ సమాధానం చెప్పాల్సి వచ్చింది.


BEGUM ZOHARA ANSARI
(-1988)

## ఆ రాత్రికి నాకు నిద్రపట్టదు

స్వరాజ్యం కాదు కావాల్సింది 'సంపూర్ణ స్వరాజ్యం' అంటూ ఎలుగెత్తిచాటి గాంధీజీ అభిప్రాయానికి వ్యతిరేకంగా సభికుల్ని ఆకట్టుకుని, గాంధీజీని సయితం కలవర పెట్టించిన 'చిచ్చర పిడుగు', మౌలానా హస్రత్ మోహాని (1878–1951). ఆయన భార్య బేగం నిశాతున్నీసా మొహాని (1884 –1937) కూడా జాతీయోద్యమంలో చురుగ్గా పాల్గొన్నారు. అహింసా సిద్దాంతంతో పూర్తి ఏకీభావన లేకున్నా హస్రత్ మోహని పట్ల గాంధీజీకి, గాంధీజీ పట్ల మోహానికి అపార గౌరవం. 1921లో అహ్మదాబాద్ కాంగ్రెస్ సమావేశంలో మోహాని 'సంపూర్ణ స్వరాజ్యం' తీర్మానాన్ని ప్రతిపాదించారు. ఈ ప్రతిపాదనను ఎప్పటి నుండో తన పత్రిక URDU-E-MOALLA ద్వారా ఆయన ప్రజలలో చర్చకు పెడుతున్నారు. అహ్మదాబాద్ కాంగ్రెస్ సమావేశంలో సంపూర్ణ స్వరాజ్యం ప్రతిపాదనకు అనుకూలంగా మౌలానా చేసిన ప్రసంగం గాంధీజీని కలవరానికి గురిచేసింది. ఈ విషయాన్ని గాంధీజీ తన ఆత్మకథలో ప్రత్యేంగా రాసుకున్నారు. 'ఆయన ప్రసంగం సభికులను బాగా ఆకట్టుకుంది. నా వాదన ఆరణ్యరోదన కాగలదని భయపడ్డాను. నాకు నేను ధైర్యం కూడగట్టుకుని...మాట్లాడదలిచాను' (The Story of My Experiment with Truth, MK Gandhi, Page. 442) అన్నారు.

మౌలానా హస్రత్ మోహాని వాదనా పటిమ గురించి టర్కీకి చెందిన రచయిత్రి Halide Eidb తో 1937లో మహాత్మాగాంధీ మాట్లాడుతూ '...when I have a talk with Mohani, I can not sleep in peace...' అని అన్నారంటే మౌలానా వాదన ఏ స్థాయిలో ఉండేదో, అది మహాత్ముడ్ని ఏ మేరకు కలతపెట్టేదో, ఏమేరకు ఆయనను ప్రభావితం చేసేదో ఊహించవచ్చు. మౌలానా హస్రత్ మోహాని బార్య బేగం నిశాతున్నీసా బేగం


MOULANA HASRATH MOHANI
(1878-1951)

స్వదేశీయతను ప్రోత్సహించటం తోపాటు విదేశీ వస్తువులను బహిష్కరణ తదితర అంశాల మీద ఆమె పటిష్టమైన ప్రచార కార్యక్రమాన్ని ఆరంభించారు. ఆ కార్యక్రమాలలో భాగంగా సహాయ నిరాకరణ ఉద్యమానికి ఊపిరి పోస్తూ అలీఘుర్ ఖిలాఫత్ స్టోర్స్ ఏర్పాటు చేశారు. ఈ మేరకు మౌలానా దంపతులు భారత దేశంలో ముందుగా స్వదేశీ బట్టల వ్యాపారం ఆరంభించిన వారయ్యారు. స్వదేశీని విస్తృతంగా ప్రచారం చేసేందుకు బేగం నిశాతున్నీసా పలు సమావేశాలు నిర్వహించారు. ఆ సమావేశాలలో ప్రసంగిస్తూ మహిళలను ఆ దిశగా ప్రోత్సహించారు. ఈమేరకు జాతీయోద్యమంలో ఉద్యమంలో ఆమె, మౌలానా హస్రత్ మొహాని నిర్వహించిన బృహత్తర పాత్రను కొనియాడుతూ 1920 మే 19నాటి యంగ్ ఇండియా పత్రికలో మహాత్మా గాంధీ ప్రత్యేక శీర్షిక కూడా నిర్వహించారు.

## అగ్రజుడు అబుల్ కలాం ఆజాద్

మహాత్మాగాంధితో అత్యంత సన్నిహితంగా మెలిగిన వారిలో అగ్రగణ్యుడిగా పేర్కొనదగిన స్వాతంత్ర్య సమరయోధులు అబుల్ కలాం ఆజాద్ (1888–1958). బ్రిటిష్ వలసపాలకులకు వ్యతిరేకంగా విప్లవిస్తున్న అబుల్ కలాం ఆజాద్ 1920 జనవరిలో మొదటి సారిగా మహాత్మాగాంధీని కలుసుకున్నారు. అప్పటి నుండి ఆజాద్ తన విప్లవబాటను వీడి గాంధీజీ అహింసా మార్గాన ఖిలాఫత్–సహాయ నిరాకరణ ఉద్యమంలో చురుగ్గా పాలొన్నారు. జాతీయోద్యమంలో భాగంగా సాగిన ప్రతి కార్యక్రమంలో ఆయన మహాత్ముని వెంట సాగారు. భారత విభజనను, వేర్పాటు వాదాన్ని పూర్తిగా వ్యతిరేకించారు. జాతీయోద్యమకారుడిగా దశాబ్దానికి పైగా ఆయన జైలు జీవితం గడిపారు. 1947 జనవరి 15న గాంధీజీ ఒత్తిడి మీద విద్యాశాఖ మంత్రిగా బాధ్యతలు స్వీకరించి ఆయన స్వతంత్ర భారత దేశంలో కూడా, తొలి విద్యాశాఖామాత్యులుగా భవిష్యత్తు తరాలను తీర్చిదిద్దే విలక్షణమైన విద్యా ప్రణాళికలను రూపొందించి అమలుచేశారు.



GANDHIJI AND MOULANA ABUL KALAM AZAD (1888-1958)

## 'మొహిద్దీన్ సాబ్ కైసే హై?'

ఖిలాఫత్-సహాయ నిరాకణోద్యమాల సందర్భంగా మహాత్ముని పిలుపు మేరకు ఆయన తన గౌరవ మేజిస్ట్రేటు పదవికి రాజీనామా చేసిన తొలి ఆంధ్రుడిగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం కృష్ణాజిల్లా విజయవాడకు చెందిన మహమ్మద్ గులాం మొహిద్దీన్ (1882-1973) గణుతికెక్కారు. ఈ విషయాన్ని ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు అయ్యదేవర కాళేశ్వరరావు 'నా జీవిత కథ (నవ్యాంధ్రము)' గ్రంధంలో ప్రస్తావిస్తూ, 'నా ముఖ్య మిత్రులైన మహమ్మద్ గులాం మొహిద్దీన్ సాహెబుగారు మొదటి తరగతి గౌరవ మేజిస్ట్రేటుగ నుండిరి. నాతోపాటుగా తాను కూడా గౌరవ ఉద్యోగము వదలు కొనెదమని ప్రకటించిరి. అప్పుడు శ్రీమాన్ చక్రవర్తి రాజగోపాలచారి గారు కూడా యుండిరి. ఆంధ్రదేశములో మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ దౌర్జన్యరహిత సహాయ నిరాకరణోద్యమము ననుసరించి శాసనసభ అభ్యర్థిత్వమును, మొదటి తరగతి గౌరవ మెజిస్ట్రేట్ పదవిని వదలుకొన్న వారము అప్పటికి మేమిద్దరమే. ఈ సంగతి గాంధీ గారు ఆ సభలో గుమికూడిన వేలాది ప్రజల ముందు కరతాళ ధ్వనుల మధ్య ప్రకటించిరి. తమ 'యంగ్ ఇండియా' పత్రికలో కూడా వ్రాసిరి', (పుట.291) అని పేర్కొన్నారు. 1921లో విజయవాడలో జరిగిన జాతీయ కాంగ్రెస్ జాతీయ సమావేశాల సందర్భంగా సమావేశాల నిర్వహణకు తన సంపదను మంచినీళ్ళ ప్రాయంగా



MOHAMMED GULAM MOHIDDIN (1882-1973)

... మొహిద్దీన్ ఖర్చు చేశారు. అయ్యదేవర స్వయంగా గాంధీజీకి ఈ విషయం తెలుపుతూ గులాం మొహద్దీన్ కాంగ్రెస్‌కు ఎంతో ఆర్థిక సహాయం చేశారనగా, మొహిద్దీన్ తక్షణమే స్పందిస్తూ, తాను కాంగ్రెస్ కోసం ఖర్చు చేయలేదని తన దేశం కోసం మాత్రమే వ్యయం చేశానని చెప్పడంతో అక్కడున్న నేతలంతా ఆనందిస్తూ మొహమ్మద్ గులాం మొహద్దీన్‌ను అభినందించారట. గులాం మొహద్దీన్ వితరణ, ఆతిథ్యాన్ని మరువని మహాత్మాగాంధీ విజయవాడ నుండి ఎవ్వరు వెళ్ళినా 'మొహిద్దీన్ సాబ్ ఏలా ఉన్నారు?' అని ఆయన క్షేమసమాచారాలను కనుక్కొనేవారట. (ప్రముఖ పాత్రికేయుడు, రచయిత, చరిత్రకారుడు యల్.వి.రమణ (విజయవాడ) కథనం). ◆

**ఈ** పుస్తకాంశం 'గాంధీ ముస్లిం భాయి భాయి' శీర్షికన మహాత్మాగాంధీ 150వ జయంతి సందర్భంగా 2 అక్టోబర్ 2019న 'సాక్షి' దినపత్రికలో ప్రచురితమైంది. ఈ వ్యాసాన్ని చదివిన పాఠక మిత్రులు, పెద్దలు మరింత వివరంగా విషయాన్ని విశదీకరిస్తూ పుస్తకంగా ప్రచురిస్తే బాగుంటుందని సూచించారు. ఆ సూచలు, సలహాల మేరకు ఈ చిరుపొత్తం రూపు దిద్దుకుంది. **బారిస్టర్ గాంధీ** దక్షిణాఫ్రికాలో ప్రజా సేవారంగంలో అడుగిడి సత్యాగ్రహోద్యమ నాయకునిగా భాసిల్లి, ఆ తరువాత భారతావని మీద అడుగిడి భారత జాతీయోద్యమంలో ప్రధాన పాత్ర నిర్వహించి **మహాత్మాగాంధీ** అయ్యేంత వరకు ఆయనతోబాటుగా నడిచిన ముస్లిం సహచరులు, ఆయనను అనుసరించిన ముస్లిం అనుచరుల గురించి నా ఎరుకలో ఉన్న సమాచారాన్ని ఇక్కడ పొందుపర్చాను. నాకు తెలియని సమాచారం మరెంతో ఉండొచ్చు. ఆ సమాచారం తెలిసిన మిత్రులు, పెద్దలు నాకు తెలిపినట్టయితే దానిని పునర్ముద్రణలో పొందుపర్చుకుందాం. ఈ పుస్తకం 2019లో మూడువేల కాపీలు ప్రచురించి రెండు తెలుగు రాష్ట్రాలలో ఉచితంగా మిత్రులకు, సంస్థలకు, గ్రంథాలయాలకు పంపిణి చేశాం. మిత్రులు చాలామంది మళ్ళీ మళ్ళీ ఈ పుస్తకాన్ని కోరుతున్నందున 2020 ఫిబ్రవరిలో పునర్ముద్రించాం.

**– ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్, ఉండవల్లి–522501.**



## సయ్యద్ నశీర్ అహమ్మద్ :

సయ్యద్ నశీర్ అహమ్మద్ నెల్లూరు జిల్లా అల్లూరు తాలూకా పురిణి గ్రామంలో 1955 డిసెంబరు 22న జన్మించారు. తల్లిదండ్రులు : షేక్ బీబిజాన్, సయ్యద్ మీరా మొహిద్దీన్. వ్యవసాయ కుటుంబం. చదువు : ఎం.కామ్., ఎల్ఎల్.బి., సాహిత్యరత్న (హిందీ)., డి.జె. వృత్తి : న్యాయవాది. ప్రవృత్తి పాత్రికేయుడు -రచయిత. ప్రస్తుత నివాసం : ఉండవల్లి - 522501, తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్.

చిన్నతనం నుండి రాయడం ఆరంభించినా 1975లో 'మరోప్రపంచం' లిఖిత మాసపత్రికలో తొలిసారిగా కవితలు ప్రచురితం. 1976లో 'ప్రగతి' సచిత్ర వారపత్రిక, జయశ్రీ, జ్యోతి మాసపత్రికల్లో పలు కథానికలు, కార్టూన్లు చోటు చేసుకున్నాయి. అప్పటి నుండి పలు పత్రికల్లో కవితలు, గేయాలు, కథలు, రాజకీయ -సామాజిక-సాహిత్య-చరిత్ర-సమీక్షా వ్యాసాలు, పలు వ్యంగ్య చిత్రాలు ప్రచురితం. మిత్రుడు విఎస్సార్ అవధానితో కలసి 'మరో ప్రపంచం', 'భేరి' లిఖిత మాస పత్రికలు వెలువరించారు. రాష్ట్రంలోని పలు ప్రజా సంఘాలు, సంస్థలు నిర్వహించిన పత్రికలకు సంపాదకునిగా సేవలు అందించారు. స్వయంగా 2006 నుండి 2011 వరకు 'ఇండియా'మాసపత్రిక ప్రచురించారు.

భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లిం జన సముదాయాల పాత్రను వివరిస్తూ, 1998లో గ్రంథ రచన, ప్రచురణ ప్రారంభించారు. అప్పటి నుండి 1. భారత స్వాతంత్ర్యోద్యమం-ముస్లింలు, 2. భారత స్వాతంత్ర్యోద్యమం: ముస్లిం మహిళలు, 3. భారత స్వాతంత్ర్యోద్యమం: ఆంధ్రప్రదేశ్ ముస్లింలు, 4. మైసూరు పులి: టిపూసుల్తాన్, 5. భారత స్వాతంత్ర్యోద్యమం: ముస్లిం ప్రజా పోరాటాలు, 6. షహీద్-యే-ఆజం అష్ఫాఖుల్లా ఖాన్, 7. భారత స్వాతంత్ర్య సంగ్రామం: ముస్లిం యోధులు-1, 8. చిరస్మరణీయులు, 9. 1857: ముస్లింలు, 10. అక్షరశిల్పులు. 11. చరితార్థులు (తెలుగు) / ది ఇమ్మోర్టల్స్ (ఆంగ్లం), 12. కువైట్ కబుర్లు, 13. బిస్మిల్-అష్ఫాఖ్ 14. పండిత రాంప్రసాద్ బిస్మిల్-అష్ఫాఖుల్లా ఖాన్, 15. అజాద్ హింద్ ఫౌజ్ : ముస్లిం పోరాట యోధులు, 16. గాంధీజీ ప్రాణరక్షకుడు : బతఖ్ మియా అన్సారీ, 17. మహాత్మాగాంధీ : ముస్లిం సహచరులు-అనుచరులు గ్రంథాలను వెలువరించారు.

'భారత స్వాతంత్ర్యోద్యమం-ముస్లింలు' శీర్షికతో నశీర్ రాసిన సుదీర్ఘ ఆంగ్ల వ్యాసం అలీఘర్ ముస్లిం విశ్వవిద్యాలయం ప్రచురించిన 'భారత స్వాతంత్ర్యోద్యమం-ముస్లింల పాత్ర' వ్యాససంపుటిలో చోటుచేసుకుంది. ఈ వ్యాసాన్ని పలు రాష్ట్రాలలోని వివిధ సంస్థలు, సంఘాలు, పత్రికలు తమ ప్రత్యేక సావనీర్స్‌లో స్థానం కల్పించాయి. ఆయన గ్రంథాలను పలు ప్రాంతాల పత్రికలు ధారావాహికంగా ప్రచురించాయి, ప్రచురిస్తున్నాయి. ఈ గ్రంథాలలో 'పండిత రాంప్రసాద్ బిస్మిల్- అష్ఫాఖుల్లా ఖాన్' గ్రంథం తెలుగు, ఆంగ్లం, ఉర్దూ భాషల్లో 20,000 ప్రతులు, గాంధీజీ ప్రాణరక్షకుడు : బతఖ్ మియా అన్సారీ గ్రంథం తెలుగు, ఆంగ్లం, ఉర్దూ, హింది భాషల్లో 21,000 ప్రతులు ముద్రించి భారతదేశ వ్యాప్తంగా 250 పైగా వివిధ ప్రాంతాలకు ఉచితంగా పంపిణి చేయబడ్డాయి.

తెలుగు-ఆంగ్ల భాషల్లో 2014లో వెలువడిన 'చరితార్థులు' ఆల్బమ్ జాతీయంగా, అంతర్జాతీయంగా విశేష ఆదరణ పొంది 2019లో తమిళభాషలో కూడా వెలువడింది. 'చరితార్థులు' ఆల్బమ్ ఉర్దూ, తమిళం, హింది, గుజరాతి, మరాఠి భాషల్లో వెలువడనుంది. ఆయన గ్రంథాల పిడియఫ్ ఫైల్స్‌ను అసక్తి గల పాఠలకులకు ఉచితంగా అందిస్తున్నారు. అంతర్జాలంలో రెండు వెబ్‌సైట్లు ఏర్పాటు చేయించి తన పుస్తకాలను ఉచితంగా డౌన్‌లోడ్ చేసుకునే వీలు కల్పించినందున ఇప్పటి వరకు పదహారు వేలకు పైగా పాఠకులు డౌన్‌లోడ్ చేసుకున్నారు. ప్రస్తుతం 01) చరితార్థులు-2వ భాగం, 02) చిరస్మరణీయులు-2వ భాగం, 03) భారత స్వాతంత్ర్య సంగ్రామం : ముస్లిం యోధులు-2

భాగం, 04) చరిత్ర సృష్టించిన ముస్లిం మహిళలు, 05) మాతృభూమి సేవలో కృతార్థులైన ముస్లిం ముద్దు బిడ్డలు, 06) దక్షణ భారత కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతః దాదా అమీర్ హైదర్ ఖాన్, 07) భారతీయ ముస్లింలు-స్థితిగతులు, 08) భారతీయ ముస్లిం సమాజం ః అపోహలు-వాస్తవాలు గంథ్రాలను వెలువరించనున్నారు.

సయ్యద్ నశీర్ అహమ్మద్ గత రెండు దశాబ్దాలుగా సాగిస్తున్న కృషికి గుర్తింపుగా 1) వి.ఆర్ నార్ల విశిష్ట జర్నలిస్టు అవార్డు (విజయవాడ, 2004), 2) తెలుగు భాషా పురస్కారం (గుంటూరు, 2007), 3) డాక్టర్ బి.ఆర్. అంబేడ్కర్ ఫెలోషిప్ అవార్డు (న్యూఢిల్లీ, 2008), 4) స్వాతంత్ర్య సమరయోధుడు అష్ఫాఖుల్లా ఖాన్ స్మారక అవార్డు (హైదరాబాద్, 2010), 5) బి.యస్ రాములు పురస్కారం (హైదరాబాద్, 2011), 6) కవికోకిల చిన సుబ్బయ్య స్మారక పురస్కారం (గుంటూరు, 2012), 7) సంఘమిత్ర అవార్డు (బుక్ ఆఫ్‌స్టేట్ రికార్డ్స్, హైదరాబాద్, 2013), 8) మాస్టార్‌జీ ఫౌండేషన్ సేవారత్న పురస్కారం, (విశ్వజన కళా మండలి, హైదరాబాద్, 2015), 9). జీవిత సాఫల్యా పురస్కారం (శ్రీమతి జ్యోతిబాయి పూలే ఎడ్యుకేషనల్, చారిటబుల్ ట్రస్ట్, విశాఖపట్నం, 2016), 10) ఉగాది పురస్కారం (ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం, 2016), 11) విశిష్ట సేవాపురస్కారం (నరసరావుపేట కళావేదిక, 2016), 12) జనోపకారి ఆత్మీయ పురస్కారం (జనోపకారి మాసపత్రిక, కావలి, 2016), 13) ప్రౌడ్ ఆత్మీయపురస్కారం (హైదరాబాద్ 2016), 14) లోక్ బంధు సద్భావనా సమ్మాన్ జాతీయపురస్కారం (లక్నో, ఉత్తరప్రదేశ్ 2017), 15) కీర్తి పురస్కారం (పోట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్ 2015), 16) 'మహారాష్ట్ర బుక్ ఆఫ రికార్డ్స్'(కవితాసాగర్ పబ్లికేషన్స్, జయసింగ్‌పూర్, మహారాష్ట్ర, 2018.), 17) 'సృజన ప్రియ పురస్కారం'. (సృజనప్రియ మాసపత్రిక,హైదరాబాద్, 2018). 18) 'డాక్టర్ పట్టాభి ప్రతిభా పురస్కారం' డాక్టర్ పట్టాభి కళాపీఠం, విజయవాడ, 2018), 19) రాష్ట్రస్థాయి ఉత్తమ తెలుగు జర్నలిస్టు అవార్డు (కడప, 2018), 20) 'మాటి రతన్ పురస్కారం-2018' (అష్ఫాఖుల్లా ఖాన్ స్మారక అమర వీరుల పరిశోధనా సంస్థ, ఫైజాబాద్, ఉత్తరప్రదేశ్, 2018) . 21 'గిడుగు రామమూర్తి సాహితీ పురస్కారం' (గిడుగు రామమూర్తి పంతులు ఫౌండేషన్, హైదరాబాద్, 2019), 22) సురా సాహిత్య, సామాజిక సేవా పురస్కారం (సావిత్రిబాయి పూలే ఎడ్యుకుషనల్ అండ్ ఛారిటబుల్ ట్రస్టు విశాఖపట్నం, 2019), 23).'కళా భారతి' పురస్కారం (మదనపల్లి సాహితీ కళా వేదిక' మదనపల్లి,7, డిసెంబర్ 2019)

భారత ముస్లిం స్వాతంత్ర్య సమరయోధుల సమాచారాన్ని ప్రజలందరికి అందజేయాలన్న లక్ష్యంతో భారతదేశం అంతటా వివిధ సంస్థల, వ్యక్తుల ఆహ్వానం మేరకు స్వాతంత్ర్య సమరయోధుల చిత్రపటాల ప్రదర్శనల ఏర్పాటు చేస్తున్నారు. విద్యార్థులు తమ పుస్తకాలకు అంటించుకునే 'నేమ్ స్టికర్లు', స్వాతంత్ర్య సంగ్రామంలో ప్రత్యేకత సృష్టించుకున్న యోధుల వివరాలతో చిరు పొత్తాలను మిత్రులు, వివిధ సంస్థల సహాయ సహకారాలతో ప్రచురించి దేశవ్యాప్తంగా ఉచితంగా పంపిణి చేశారు. 'గాంధీజి ప్రాణరక్షకుడు ః బతఖ్ మియా అన్సారి ' పుస్తకాన్ని తెలుగు, ఉర్దూ, హిందీ, ఆంగ్ల భాషలలో 21,000 కాపీలు ప్రచురించి దేశమంతటా ఉచితంగా పంపిణి చేశారు. మన పూర్వీకుల త్యాగమయ-సాహసోపేత చరిత్రలను ప్రజల, ప్రధానంగా యువత, విద్యార్థుల ఎరుకలోకి తెచ్చేందుకు ఆచరణాత్మక కార్యక్రమాల ద్వారా గత 21 ఏండ్లుగా కృషి సల్పుతున్నారు.

సయ్యద్ నశీర్ అహమ్మద్  రచయిత, నటుడు, చిత్రకారుడు, వ్యంగ్యచిత్రకారుడు, వక్త, సంపాదకుడు, పాత్రికేయుడు, న్యాయవాది, చరిత్రకారుడు, సామాజిక సేవాకార్యకర్తగా వివిధ రంగాలకు సేవలు అందిస్తున్నారు. అంతర్జాతీయ-జాతీయ-ప్రాంతీయ సభలు, సమావేశాలు, సదస్సులలో పాల్గొంటున్నారు. ఆర్థిక-సామాజిక అసమానతలు లేని లౌకిక, ప్రజాస్వామ్య వ్యవస్థ నిర్మాణంలో రచయితగా భాగస్వామ్యం అందించడం, జ్ఞానం ప్రజాస్వామీకరించబడాలన్న ఆకాంక్షతో అవిశ్రాంతంగా రచనా వ్యాసంగం సాగిస్తున్నారు.

**- ప్రచురణకర్తలు**